

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీనిగమాంత దేసికాయనమః

# వైరాగ్యపంచకమ్

వరదరాజస్వామి, కాంచీపురం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్రగ శింగరాచార్యులు

సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచానూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# వైరాగ్యపంచకమ్

## అవతారిక:

వైరాగ్యమంటే –లౌకికవిషయాలలో ఆసక్తి లేకపోవడం. దీనిని వివరించే అయిదు శ్లోకాలను కలిగిన స్తుతి కనుక దీనికి ఈ పేరు వచ్చింది. దేశికులు కాంచీపురంలో అనుష్ఠానగ్రంథప్రవచనాదులతో కాలక్షేపాన్ని చేసే సమయంలో, దేశికులకు చిన్నతనంలో స్నేహితుడైన విద్యారణ్యులు విజయనగరరాజసభలో ఆస్థానవిద్వాంసులుగా ఉండేవారు. దేశికులు మహావిద్వాంసులైనా, అతిసామాన్యమైన జీవితాన్ని గడపుతున్నారని తెలిసికొని, విజయనగరప్రభువువద్ద తమకు ఉండే పలుకుబడిని ఉపయోగించి, దేశికులకు ధనసహాయం చేయాలని వారు తలచారు. దేశికులను రాజసభకు రావలసినదని చాలా ప్రీతితో, గౌరవంతో ఆహ్వానిస్తూ విద్యారణ్యులు ఆహ్వానపత్రికను పంపారు. ఆ పత్రికను చూచిన దేశికులు తమ వైరాగ్యాన్ని తెలిపే ఒక శ్లోకాన్ని రచించి బదులు పంపారు. అయినా, విద్యారణ్యులు మళ్ళీ దేశికులను రమ్మని నిర్బంధిస్తూ ప్రార్థించారు. దేశికులు అందుకు అంగీకరించకుండా, అయిదు శ్లోకాలతో తమ వైరాగ్యాతిశయాన్ని వ్యక్తం చేస్తూ సమాధానం పంపారు. విద్యారణ్యులు దేశికుల వైరాగ్యానికి చాలా ఆశ్చర్యపడ్డారు. ఆ అయిదు శ్లోకాలు వైరాగ్యపంచకంగా ప్రసిద్ధి చెందాయి.

ఇందులో, దేశికులు, మానవులను యాచించినందున కలిగే నైచ్యం, అన్నవస్త్రాలకోసం అల్పులను సేవించడంవల్ల కలిగే తక్కువదనం, ఎంత దుఃఖం కలిగినా మానవులను యాచించని తమ మనోనిశ్చయం, అల్పుల వాకిటి తిన్నెలపై వేచి ఉండేవారి నీచస్థితి, ఇహలోకైశ్వర్యంలోని ప్రయోజనరాహిత్యం మొదలైనవానిని పలికి, తమకు వరదరాజస్వామియే నశించని సంపద అని అంటూ కృతిని ముగించారు.

★★★★

# వైరాగ్యపంచకమ్

1) క్షోణీ కోణ శతాంశపాలనకలాదుర్వారగర్వానల
క్షుభ్యత్ క్షుద్రనరేన్ద్రచాటురచనాధన్యాన్ న మన్యామహే ।
దేవం సేవితుమేవ నిశ్చినుమహే యోऽసౌ దయాళుః పురా
ధానాముష్టిముచే కుచేలమునయే దత్తే స్మ విత్తేశతామ్ ॥

భూమిలోని ఒక మూలలోని అత్యల్పభాగాన్ని రక్షించడంవల్ల కలిగే, వారించడానికి సాధ్యం కాని గర్వమనే అగ్నివల్ల మనస్సులో కాలుష్యాన్ని పొందే అల్పులైన ప్రభువులను అందంగా స్తుతించడంవల్ల తమను అదృష్టవంతులని తలచేవారిని మేము గౌరవించము. సహజమైన కరుణను కల ఈ భగవానుడు పూర్వం ఒకానొక సమయంలో తనకు ఒక పిడికిలి అటుకులను ఇచ్చిన కుచేలుడనే మునికి కుబేరుని సంపదవంటి సంపదను ఇచ్చాడు. అటువంటి స్వామిని సేవించడంకోసమే మేము నిశ్చయించుకొన్నాము.

2) శిలం కిమనలం భవేదనల మౌదరం బాధితుం
పయః ప్రసృతిపూరకం కిము న ధారకం సారసమ్ ।
అయత్నమలమల్లకం పథి పటచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధా హ్యహహ! కుక్షితః కుక్షితః ॥

క్షేత్రంలో రాలిన ధాన్యం కడుపులోని జఠరాగ్నిని చల్లార్చడానికి చాలదా! పుడిసిలి పరిమాణంలోని గుంటలోని నీరు ప్రాణధారణకు చాలదా!షదారిలో దొరికిన, చినిగిన పాత బట్ట అయినా అప్రయత్నంగా లభించిన కౌపీనంగా కాదా!

పండితులుకూడా తమ కడుపు నింపుకోవడంకోసం వ్యర్థంగా ప్రభువులను ఆశ్రయించి, వారిని పొగడుతున్నారే! అయ్యో!

3) జ్వలతు జలధి క్రోడక్రీడత్కృపీడభవప్రభా
ప్రతిభట పటుజ్వాలామాలాకులో జఠరానలః ।
తృణమపి వయం సాయం సంఫుల్లమల్లి మతల్లికా
పరిమళముచా వాచా యాచామహే మహీశ్వరాన్ ॥

జఠరాగ్ని సముద్రం మధ్యలోని బడబాగ్నిని జ్వాలలకు మించిన గొప్ప జ్వాలల వరుసను కలిగినదై, గొప్పగా మండనీ! మేముమాత్రం సాయంకాలసమయంలో బాగా వికసించిన మల్లెపూల గొప్ప పరిమళాన్ని వెదజల్లే( సువాసన కల మల్లెపూలవలె మనస్సును ఆకర్షించే) వాక్కుతో ప్రభువులను గడ్డిపరకకోసం కూడా యాచించబోము.

4) దురీశ్వర ద్వారబహిర్వితర్దికా దురాసికాయై రచితోऽయమఞ్జలిః ।
యదఞ్జనాభం నిరపాయ మస్తి మే ధనఞ్జయస్యన్దన భూషణం ధనమ్ ॥

కాటుకరంగువంటి రంగును కలిగినది, ఏనాటికీ నశించనిది, అర్జునుని రథానికి అలంకారమైనది అయిన సంపద నాకున్నది. అందువల్ల నీచప్రభువుల ఇంటి వాకిలి బయట ఉండే తిన్నెలపై వారి అనుగ్రహంకోసం దీనంగా వేచి ఉండే స్థితికి మా ఈ నమస్కారం. (ఆ విధంగా మేము వారి ఇంటి ముందు వేచి ఉండము. ),

5) శరీరపతనావధి ప్రభునిషేవణాపాదనాత్
అబిన్ధన ధనఞ్జయప్రశమదం ధనం దన్ధనమ్ ।

వైరాగ్యపంచకమ్

ధనఞ్జయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనం
సుసాధన మబాధనం సుమనసాం సమారాధనమ్ ॥

నీటిని ఆహారంగా కల జఠరాగ్నిని చల్లార్చే సంపద శరీరం నశించేవరకు నీచప్రభువులను యాచించేటట్లు చేస్తుంది. అందువల్ల అది వ్యర్థమైనది. అర్జునుని ఉజ్జీవింపజేసినది, గోవర్ధనపర్వతాన్ని ఎత్తినది, మంచి మనసును కలవారికి సంతోషాన్ని కలిగించేది, అన్ని ప్రయోజనాలకు గొప్ప సాధనమైనది, ఏ అపాయం లేనిది అయిన సంపదే నిజమైన సంపద.

6) నాస్తి పిత్రార్జితం కిఞ్చి న్న మయా కిఞ్చిదార్జితమ్,
అస్తి మే హస్తిశైలాగ్రే వస్తు పైతామహం ధనమ్ ॥

నాకు తండ్రి సంపాదించిన ధనం అనేది ఏమీ లేదు. నేను సంపాదించినదికూడా ఏదీ లేదు. కాని, హస్తిగిరిశిఖరంపై ఉండే వస్తువైన (పరతత్త్వమైన), పితామహులనుండి తరతరాలుగా ప్రాప్తించిన వరదరాజస్వామి అనే సంపదమాత్రం ఉన్నది. (అందువల్ల నాకు ఏ లోటు లేదు. )

వైరాగ్యపంచకం సమాప్తమ్

★★★★★